# అన్నపూర్ణ వ్రత కథా ప్రారంభము



ధర్మరాజు అడిగెను :

ఓ దేవకిదేవి పుత్రుడవైన కృష్ణ! తమ్ములతోను, ద్రౌపదితోను కలిసి యీ యరణ్యమున నివసించుచు మహా దుఃఖము ననుభవించుచున్నాను నాకేమియు తోచుటలేదు. కడుపునిండ అన్నము లేదు. రాత్రి అని కాని పగలనికాని ఎక్కువ అనికాని, తక్కువ అని కాని లేదు (నీరసమైన) రుచిలేని పదార్థములు అపక్వ పదార్థములు తిని వికలమయిన మనస్సుకలవాడనై యున్నాను ఆకలితో బాధ పడుచున్నాను. నేలమీద పండుకొనుచున్నాను గడ్డలు, ఆకులు మొదలగు నవి భుజించుచున్నాను. 14

ఏ విధముగ నాకు తృప్తి కలుగుటలేదు. భీమార్జున నకుల సహదేవులతో సహా నేను దుర్మార్గులచేత నా ఐశ్వర్య మును పోగొట్టుకొనబడినాను బంధు వియోగము కలిగినది. నేను యీ దుఃఖ మెట్లు అనుభవించగలను. మానవులకు అన్న దరిద్ర మెందులకు వచ్చినది. యిటువంటి కష్ట మేమైన వున్నదా? ఏమిచేస్తే అన్న దరిద్రము బంధు జనవియోగము దైన్యము ద్వేషము పోవును చెప్పవలసినదని అడుగగ శ్రీ కృష్ణ భగవానుడు ధర్మరాజుతో నిట్లు చెప్పుచున్నాడు. 56

నా లక్ష్మీ ర్నైవ విరహో నద్వేషో నైవ దీనతా ।
భవే ద్యేన కృతే సేహ తన్మమా చక్ష్వ మాధవ ॥ 7

శ్రీకృష్ణ ఉవాచ:—

పిత్రాజ్ఞా త్యక్త సాంమ్రాజ్యో రామో రాజీవలోచనః ।
సహ సౌమిత్రి సీతాభ్యాం న్యవ సద్దం డకేవనే ॥ 8
ఏకదా లక్ష్మణో రాజ న్నాహారార్థం వనే భ్రమన్ ।
నాససాద క్వచి త్సాయం వవన్దే రఘు నన్దనమ్ ॥ 9
నిషసాద తతస్తూష్ణీం విషణ్ణః సాశ్రులోచనః ।
తము వాచ తతో రామో భ్రాతరం శ్లక్ష్ణ యాగిరా ॥ 10
వత్స మా కురు సంతాపం లోకోహి నిజదిష్టభుక్ ।
యద్ద దాతినరః పూర్వం తదాప్నోతి న చాన్యయా ॥ 11
యేన దత్తాని భోజ్యాని రమ్యాణి రసవ నిచ ।
సంప్రాప్నోతి మహాభాగో భక్ష్య భోజ్యా న్యనేకశః ॥ 12
యైర్న దత్తం క్వచి త్కించి త్తే విన్దన్తి యథా వయమ్ ।
పృథివ్యా మన్నపూర్ణాయాం వయ మన్నస్య కాంక్షిణః ॥ 13
సౌమిత్రే నూనమస్మాభిర్న బ్రాహ్మణ ముఖే హుతమ్ ।
తస్మా ద దృష్ట మన్వీక్ష్య చిన్తాం జహి మహామతే ॥ 14
ఏవం కథ యత స్తస్య తదా కుంభో ద్భవో మునిః ।
ఆజగామ సముత్థాయ తం వవన్దే రఘూ త్తమః ॥ 15
సత్కృతం సుఖమాసీన మగ స్త్యం రాఘవోఽబ్రవీత్ ।
మ మేవార్థ ముద్దిశ్య యమ్మాం త్వం పరిపృచ్ఛసి ॥ 16

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు :

ఓ ధర్మరాజ! వినుము పూర్వము రామచంద్రమూర్తి తండ్రి ఆజ్ఞవలన రాజ్యమును వదలి తమ్ముడైన లక్ష్మణుని, భార్యయైన సీతను పిలుచుకొని దండకారణ్యములో నివసించు చుండెను. ఒకనాడు లక్ష్మణుడు ఆహారము సంపాదించుకొను టకు అడవికి వెళ్లి ఆ రోజంతయు తిరిగెను, కాని ఏవిధమైన ఆహారము దొరక పందున విసిగి సాయంకాలమునకు పర్ణశాలకు వచ్చెను. (అన్నకు) రామచంద్రునకు నమస్కరించి ఆహారము దొరకలేదని చెప్పలేక మౌనముతో నిలువబడి చింతా క్రాంతు డయ్యెను. రామచంద్రుడు. లక్ష్మణుని అభిప్రాయమును గ్రహించి మృదువుగ నిట్లనుచున్నాడు లక్ష్మణ! దుఃఖంప వలదు. మానవుడు సదా పూర్వభాగ్య ఫలము ననుభవించు చుండును. పూర్వ జన్మమున రుచివంతమయిన భోజన పదార్థ మును యిచ్చివుండినట్లయితే యీ జన్మమున భక్ష్య భోజ్యములు లభించును. ఆ జన్మమునందేమి యివ్వనిచో యీ జన్మము నందేమియు నుండదు. అన్న పూరిత పృథివిమీద మనము అన్నము కొరకు అతురత పడుతున్నాము. పూర్వ జన్మమున మనము ఏ బ్రాహ్మణునికి అన్నము పెట్టలేదు. అందుచేత మనకు ఆహారము దొరకలేదు. ఇది నిశ్చయము. నీవు దుఃఖంప వలదు. ఇట్లు రామలక్ష్మణులు మాట్లాడుకొనుచుండగ అక్క డకు అగస్త్య మహాముని వచ్చెను అంత రామచంద్రుడు లేచి అగస్త్యులవారికి యథోచితముగ సత్కరించి యిప్పుడు నీవు నన్ను అడిగినట్లు రామచంద్రమూర్తి అగస్త్యులవారిని అడిగెను.

అగస్త్య ఉవాచ :—
అస్తి వారణాసీ నామ నగరీ గిరిశప్రియా ।
అపారతర సంసారాంభోధి పారవిదర్శినీ ॥ 17
తస్యాం బభూవతు ర్విప్రౌ దేవ దత్త ధనుంజయౌ ।
భ్రాతరౌ దేవ దత్తోఽభూదాఢ్యో దుఃఖీ ధనంజయః ॥ 18
తస్యచిన్తా సముత్పన్నా దరిద్రస్య కుటుంబినః ।
అహో కిమ్మే కృతం పాపం యేనాన్నం మే సుదుర్లభమ్ ॥ 19
కిమ్మయై కాకినా భుక్తం త్యక్త్వా గర్భవతీం శిశుం ।
కిమ్మయా పగతో గేహా దతిథి ర్విముఖో ద్విజః ॥ 20
కిమ్మయోపేక్షితం దత్తమన్నం భుక్తం నశ్రద్ధయా ।
నిన్దితం వాన్నకాలే కిం క్షిప్తం రోషేణ వా న్యతః ॥ 21
కిమ్మయా న్నవతా లోభాత్ దుర్భిక్షం క్రియై ।
కింవా గద్యాసు పతితం మయాన్నం సము పేక్షితం ॥ 22
కింవా గర్వా దత్యస్తేన త్యక్త మన్నం మయార్పితం ।
శ్రాద్ధేని మన్త్రితో వాహన్న గతో ధన గర్వితః ॥ 23
అనర్చయిత్వా దేవాన్ వా ప్రతిభుక్తం మయాన్వహం ।
కులదైవత కార్యేషు నిన్దితా వా కుల స్త్రియః । 24
కిం మమాలయ భోక్తారః సదా తృప్తి వివర్జితాః ।
సదన్నే సతి కింవామే కదన్నం బాంధవేర్పితం ॥ 25
కింవా శ్రాద్ధ దినే సమ్యోన్న మయా వ్యాజేన దర్శితః ।
పితృదేవ ద్విజాతీనాం కృతే వాహం నిషేధవాన్ ॥ 26
దుర్లభ మ్మమ యేనా భూన్నిత్య మన్నం కుటుంబినః ।
నిత్యమాహార పర్యాప్తో పురుషార్థోఽస్తి నాన్యథా ॥ 27
క్షుత్ క్షామానపత్య కాన్ దృష్ట్వా హృదయం మే విదీర్యతే ।
దృష్ట్వాఽధ్య శిశు భక్ష్యాణి ప్రార్థయన్తి మమార్భకాః ॥ 28

అగస్త్యుడు చెప్పుచున్నాడు :

ఓ రామచంద్ర! నీరసమయిన యీ సంసార సాగరమును దాటించు పరమేశ్వరునికి ప్రియమైన పట్టణము కాశీ. ఆ పట్టణమునందు దేవదత్తుడు, ధనంజయుడు అను యిద్దరు అన్నదమ్ములు బ్రాహ్మణులుండి, పెద్దవాడగు దేవదత్తుడు ధనవంతుడై సుఖంబున నుండెను, తమ్ముడగు ధనంజయుడు దరిద్రముతో నిట్లు దుఃఖించుచుండెను. నాభార్య గర్భిణి. యింటిలో చిన్న పిల్లలున్నారు వారికి నేనేమి కొంచము కూడ అన్నము పెట్టలేక పోతిని అయ్యో! నేను చేసిన పాపమేమి. నాయింటికి వచ్చిన అతిథి నిరాశచేత వెనుకకు తిరిగి పోయినాడా? ఎవరైన యిచ్చిన అన్నమును గౌరవించ లేద! ఆ అన్నమును శ్రద్ధతో తీసుకొన లేదా! ఆ అన్నమును నిందించితినా! భోజనము చేయుచు కోపముతో లేచి పార వైచితిన! ధనలోభముచేత అన్నము లేదని తలచితిన. త్రోవలో పడిన అన్నమును ఉపేక్షించితిన, దానిని తీసుకొనలేదా? ఏమి. అహంకారముచేత అన్నమును పారవేసితిన! శ్రాద్ధమునందు నియమింపబడిన వాడనై మోసము చేసితిన? నిత్యము దేవతా పూజలు చేయక భోజనము చేసితినా. ఏమి? కులదేవతా పూజలు చేయుచున్న స్త్రీలను నిందించినాన ఏమి? ఇంటిలోని వారిని ఎప్పుడు అసంతృప్తి కల వారినిగ చేసితినా? మంచి భోజనము పెట్టవలసిన బంధువులకు చెడు పదార్థములను పెట్టితినా? దేవ పితృ బ్రాహ్మణ పూజలను నిషేధించితినా? నా కుటుంబమునకు నిత్యము అన్నము దొరకుటలేదు నేను పురుష ప్రయత్నము చేయలేదా? ఆకలిచేత బాధపడుచున్న పిల్లలను చూచి నాహృదయము పగిలిపోవుచున్నది. 17-28

రుదన్తో రోదయన్త్యేవ కర్షన్తో దీనమాతరమ్ ।
అగతస్య యదాబాలాః పరిమ్లాన ముఖశ్రియః ॥ 29

యదాన్నం మృగయన్తే మే హాయన్నకామాః కృతజ్వరాః ।
తదా జానామ్యహం హన్త విశామి వసుధాతలం ॥ 30

అన్యచ్చ మమదారిద్ర్యం కేన దృక్ సముపస్థితం ।
న సదా భగవాన్ విష్ణు రర్చితః క్లేశనాశనః ॥ 31

న మయా కాంచనం దత్తం న గౌర్త్యైకాదశీ కృతా ।
పాత్రియశో నగ్నవనితా మయాన్యేషాం విలోకితాః ॥ 32

శయ్యాః వామే సమాక్రాన్తా వృషల్యా కామముగ్ధ యా ।
వృషచీకిల విపాత్రిణాం లక్ష్మీ దాత్రిహ్మణ్యహారిణి ॥ 33

కిం మయా మాతృ రాక్రోశః పితుర్వావిహితోరుషా ।
అథవా విన్దితా వార్యో దృష్ట్వావే పథ్య మద్భుతం ॥ 34

ఋతౌ త్యక్త్వాఽథవా భార్యా భుంజానా వాప భాషితా ।
పరాపవాద సైపైశూన్య పరవౌంసా రతోఽథవా ॥

నిత్యం మిథ్యా జనద్వేషి నిత్యం వా కలహ ప్రియః ।
విద్వాన్ ప్రష్టు మశక్తోఽన్యం జగ్రాహ నియమం వృథా॥ 36

నా పిల్లలు ధనికులు తినుచున్న రుచివంతమైన పదార్థములు నడుగుచున్నారు. వారు దీనురాలైన తల్లిని పట్టుకొని లాగుచున్నారు. ఏడుస్తున్నారు. ఏడిపించుచున్నారు. అయ్యో! ఇంటికి వెళ్లి అన్నము కొరకు తపించుచున్న పిల్లలు నన్ను చుట్టుముట్టి ఆహారము తెచ్చినావని చూచుచుందురు. నేనేమి చేయుదును. ఇక్కడనే వుండిపోదును నా కిటువంటి దరిద్రమెందులకు వచ్చినది. నేను పాపములను బోగొట్టు విష్ణు పూజ చేయలేదా? నేను బంగారు దానము, గోదానము సరైన చేయలేదా? ఏకాదశి వ్రతము ఆచరింప లేదా? ఏమి వస్త్రహీనమైన యువతి స్త్రీని చూచితిని ఏమి? ఏదైన కాంగానున యైన శూద్ర స్త్రీతో కలిసి యేక శయ్యాపైన నుండితినా ఏమి? శూద్ర స్త్రీ సంగమముచేత బ్రాహ్మణుని సంపదయే గాక బ్రాహ్మణత్వము కూడ నశించుచున్నది నేను మాతా పితృ దూషణచేసితినా యేమి? స్త్రీల అందమును జూచి వారిని నిందించితినా యేమి? ఋతు కాలమునందు భార్యను వదలితినా యేమి? భార్య భోజనము చేయునపుడు కటు వచనము చెప్పితినా యేమి? ఇతరులకు అనర్థమయిన కలతను కలిగించితినా. నీచత్వముతో యితరులు చేయు హింసలో పాల్గొంటినా? ఏమి. యితరులతో స్పర్థముగ ద్వేషము పెట్టుకొంటినా? సర్వదా యితరులతో తగవులాడుచుంటినా? యితరులు అడుగగనే సమాధానము చెప్పలేదా? నేను పండితుడ నను అహంకారముతో యితరులను అడుగకుండ నిరుపయోగముగ నిర్ణయము చేయుచుంటినా? ఏమి. ౨౮ ౮౮

సుస్నాత్వా మణికర్ణ్యాంతు నత్వా విశ్వేశ్వరం శివం ।
రుద్ర సూక్తం జపన్భక్తి మంత ఏవ్వవయ ద్దినం ॥ 37

రాత్రౌ వరతర వ్రిక్ష్యై ర్దర్భై రా పీర్య మేదినీం ।
తత్కార్ద్యాం హృదయే న్యస్య వమస్కృత్య పినాకినం ॥ 38

సుష్వాప ప్రియతో దేవీ మంబాం వంచిత్య పార్వతీం ।
తతః స్వప్నే౽ వద ద్విప్రో బ్రాహ్మణో జటిల శ్శుభః ॥ 39

విప్రోవాచ :

పురా కాంచీ పురే రాజ్ఞః పుత్రో౽ భూ చ్ఛత్రు మర్దనః ।
తస్య మిత్ర మభూత్కో౽పి శూద్రో హేరంబ సంజ్ఞకః ॥ 40

యౌవ రాజ్యం పితుః ప్రాప్య కుమారః శత్రు మర్దనః ।
హేరంబ మాత్మ సస్తుల్యం చక్రే భక్త్యా పరాయణః ॥ 41

క్వచి ద్ధేరంబ సహితః కుమారో మృగయాం గతః ।
విమ్నాన్ వరాహాన్ మహిషాన్గండకా న్హరి ణాన్ఛశాన్ ॥ 42

చచార మృగయాం హృష్టః కుమారః సహసైని కైః ।
తత్రై కః పర్వతా కారో వరాహః సముపస్థితః ॥ 43

అన్నపూర్ణ పూజా కల్పము.

ఆ ధనంజయుడు ఈయోవిధముగ నాలోచింపుచు నొకానొకనాడు మణికర్ణికా ఘట్టమునందు స్నానము చేసి ముక్తి మంటపమునందు కూర్చొని రుద్ర పారాయణము చేయు చుండెను. పగలిట్లుగడపి రాత్రి కాగానే పవిత్రమయిన కుశను భూమిమీద పరచుకొని దానిమీద పరుండి వుండెను. తనకుగల మనో వేదనను గురించి ఆలోచించుచు పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించుకొని నిద్రించెను. ధనంజయునికి ఆ నిద్రలో స్వప్నము వచ్చినది. ఆ స్వప్నములో అందముగ జడలు ధరించిన వొకానొక బ్రాహ్మణుడు కనుపించి యిట్లు చెప్పుచున్నాడు. 87-89

## స్వప్న వృత్తాంతము

బ్రాహ్మణుడు చెప్పుచున్నాడు :

పూర్వకాలమున కాంచీ నగరము నందొక రాజు గలడు. అయనకు శత్రుమర్దనుడను కొమారుడు గలడు. ఆ రాజ కుమారునికి హేరంబుడను బాదుర్పు స్నేహితుడుండెను. రాజు తన కుమారుని యువరాజ పట్టాభిషేకమునందు హేరంబుని కూడ గౌరవించెను. ఒకనాడు యువరాజగు శత్రుమర్దనుడు హేరంబుని వెంట నిడుకొని వేటకు వెళ్లెను. శత్రుమర్దనుడు సంతోషముతో సైన్య పరివృతుడై అడవిపందులను,

దారయన్నివ భూభాగం గ్రసన్నివ చమూం రుషా ।
తచ్చ పార్శ్వార్దితః శస్త్రైర్ఘ్నిఘ్నః పరితః శితైః ॥ 44

శ్వావః సహస్రాణ్యా బభ్రుః కుర్వన్తః శబ్దముల్బణం ।
సోఽపి కోలో మహా శ్వానవ మత్య తృణం యథా ॥ 45

స్వదారయచ్ఛునః క్రోడో నృణాం జంఘాన్తర బహూః
హయాశ్చ వృష పైక్షీనాః కృతాన్తేన చ విద్రుతాః ॥ 46

తతః కోలాహలే జాతే స గతః శత్రుమర్దనః ।
తం జఘాన శరేణాశు స్వర్ణ పుంఖేన వేగినా ॥ 47

తస్యాశ్చేత్య ప్రహారం సవరాహో రాజ వాజినం ।
అభి దుద్రావ వేగేన పుప్లువే స తురంగమః ॥ 48

పశ్చాన్ముఖో నృపసుతో జఘాన సూకరం పునః ।
శస్త్రైర్నార్కగ్రితః కోలః పలాయనపరోఽభవత్ ॥ 49

తమను ప్రయయౌ వీరః సముద్ధాప్యాసి ముత్తమం ।
న చానుగన్తుం శక్తోఽభూ దన్యస్తాదృగ్ధయం వినా ॥ 50

హేరండోఽసు యయౌ దేశో యస్య తుల్య తురంగమః ।
స హత్వా యోజనశతే సూకరం శత్రు మర్దనః ॥ 51

అడవి దున్నలను, జింకలను, ఇతర క్రూర మృగములను వేటా డుచు వుండగ, పర్వతాకారముగ నున్న అడవి పంది వచ్చినది. అది భూమిని బ్రద్దలు చేయును. సైన్యమును చెల్లాచెదరు చేయునని అనిపించుచున్నది. ఆత్మ రక్షణ కొరకు సైన్యము నాలుగు వైపులనుండి వాడిగల బాణములతో దానిని కొట్టు చుండిరి. వేట కుక్కలు భయంకరముగ అరచుచు దాని మీదికి పరుగెత్తుచు వచ్చినవి. ఆ భయంకరమైన పంది వారిని ఇబ్బ పెట్టక వారిని చీల్చి వేసినది. మనుష్యుల వక్షస్థలములు పిక్కలు కూడ బ్రద్దలగునట్లు చేసినది గుర్రముల యొక్క అండ కోశములు పడిపోవునట్లు చేసినది. యీ కారణముచేత సైన్యము గుర్రములు వెనుకకు పరుగెత్తి పోయినవి. యీ భయంకర మయిన కోలాహల ధ్వనిని విని శత్రు మర్దనుడు వచ్చి ఆ విజృం భించిన ఆ పందిని వేగముగల బాణములతో కొట్టెను. ఆ పంది యువరాజు బాణములను పరకుగొనక రాజ కుమారుని గుర్రము పైన యెగిరి పడినది. ఆ గుర్రముకూడ బెదరి పరుగెత్తినది. రాజకుమారుడు గుర్రమును మరల వెనుకకు త్రిప్పుకొని యీ పందిని కొట్టెను. బాణములచేత దెబ్బలు తిని పంది పరుగెత్తినది. రాజకుమారుడు మంచి ఖడ్గమును ధరించి దానిని వెంబడించెను. వేగముగ పోవు గుర్రము లేక దానిని వెంబ డించలేదు కదా ? అట్లగనె కొన్ని పందల ఆమడల దూరము వెళ్లి తుదకు ఆ రాజ కుమారుడగు శత్రుమర్దనుడు ఆ పందిని చంపెను. 49-51

ఉత్తీర్య శ్లథ పర్యాణం తురగం సమచాలయత్ ।
హేరంబోఽపి గతః పశ్చా దుత్తీర్య తురగం దధే ॥ 52

క్షణం విశ్రమ్య తౌ వీరౌ క్షుత్పిపాసా సమాకులౌ ।
సప్రచ్ఛ తుర్జలం కశ్చిన్మునిం కుశ సమిద్ధరం ॥ 53

స నీత్వా స్వాశ్ర మస్తౌతు ముని కృకేశి గతశ్రమౌ ।
స్నాతయోః పీతజలయోః శ్యామ శక్తును పాహారతు ॥ 54

ఉం భవ్యత్వా హ్యతాన్ మేధ్యాన్విత్య దేవాగ్ని శేషితాం ।
తా న్గృహీత్వా పరిహ్యష్టాత్మా కుమారో బుభుజే మధీః ॥ 55

అచిర ప్రాప్త సంపత్తి ర్గర్వితః సన్నృపానుగః ।
ఉపవిశ్య వినిద్యాథ విశ్రుతం బుభుజేఽల్పకమ్ ॥ 56

వికరన్నవనౌ భూమౌ వైరస్యం ప్రతి దర్శయన్ ।
తత్యా జ్యానాద రాన్మూఢః రాజ పుత్రస్తు సాదరం ॥ 57

భూమౌ పతిత మప్యన్న ముద్ధాహ్య శ్వాంతి శ్రద్ధయా ।
అలోడ్య పత్రపుటకం పహ భూరిజలే నచ ॥ 58

తతో విశ్రామ్య మునినా హ్యనుజ్ఞాతో నృపాత్మజః ।
ప్రణమ్య సహహేరంబో జగామ నిజపత్తనం ॥ 59

రాజ కుమారుడు గుర్రమునుదిగి తీను సర్దుతు నుంచెను. అంతలో వెనుకనుండి హేరంబుడు గూడ వచ్చి శత్రు మర్దనుని కలుసుకొని, గుర్రమును దిగి రాజ కుమారుని గుర్రమును పట్టుకొనెను. ఆకలి దప్పులచేత అలసిపోయిన ఆ వీరు లిద్దరు కొంచము విశ్రాంతి తీసుకొనుచుండిరి. అచ్చట హోమము కొరకు కుశ, సమిధలు ఏరుకొనుచున్న మునిని చూచి యిట్లు అడిగిరి, అయ్యా! ఇచ్చట మంచి నీరెక్కడ దొరకునని యడిగిరి. ఆ ముని వారలను తన యాశ్రమమునకు కొనిపోయి వారి కుపచారములు చేసెను. అముని ఆ పురుషులకు స్నానము నకు నీరు త్రాగుటకు చల్లని తీర్థము, తినుటకు పవిత్రమయిన సత్తుపిండిని యిచ్చెను అయ్యలారా! ఇది ఉంఛ వృత్తితో సంపాదింపబడి పవిత్రమైన అన్నము. (రైతు పైరు కోసి తీసు కొని పోవునప్పుడు క్రిందపడిపోయిన ధాన్యము) అట్లు సంపా దింపబడిన దానిని ఉంఛ వృత్తి సంపాదన అందురు. దీనిని దేవ, పితృ పూజలందు, అగ్నిలో హోమము చేయబడు చుండును. మిగిలిన సత్తును ప్రీతిగ మేము భుజించుచుందుము. అని చెప్పెను. చాలా రోజులనుండి యువరాజు ననుసరించుచు అనంతభోగముల ననుభవించుచున్న హేరంబుడు గర్వితుడై యా సత్తును తీసుకొని వాసన చూచి కొంచెము మాత్రమే తిని మిగిలినది క్రింద పారవైచెను ఆ రాజకుమారుడైన శత్రుమర్ద నుడు క్రిందపడిన సత్తు (అన్నమును) ప్రేమతో తీసుకొని భుజించెను. చివర అన్నము పెట్టిన దొప్పను కూడ కడిగి ఆ నీరుకూడ త్రాగెను. పిదప శత్రుమర్దనుడు హేరంబుడు, ఆ మునికి నమస్కారము చేసి ఆజ్ఞను తీసుకొని తిరిగి తమ పట్టణమును చేరిరి. 52-53

యోఽసౌ రాజకుమారః సదేవ దత్తస్తవాగ్రజః ।
ధన ధాన్య సుతైర్యుక్తో లేభే మోక్ష పురేవపుః ॥ 60

ఉచ్ఛ్యాన్న భోగా త్స్వైరంభోయః సచత్వం ద్విజోత్తమః ।
ఉంఛాన్నం యత్వయా భుక్తం కించి జ్జాత స్తతో ద్విజః ॥ 61

అన్నా వాదర దోషేణ దరిద్రోఽన్న వివర్జితః ।
యే కుర్వన్తి నరా హేలా మన్నస్య ద్విజ సత్తమ ॥ 62

అన్నహీనాః ప్రజాయన్తే దరిద్రాః దుఃఖ భాగినః ।
తస్మా ద్విస్వా దమన్నం భుంజీతాఽమృత రత్సుధీః ॥ 63

దద్యా దనుదినం చాన్నం బ్రాహ్మణాయ సుసత్కృతం ।
తత్కురు ష్వాధునా బ్రాహ్మణాన్న పూర్ణ వ్రతం శుభం ॥ 64

౦ పశ్యసే వాన్నదుఃఖాని సంపద్భిశ్చ వ మోక్ష్యసే ।
ఇతి శ్రుత్వా వ్రతం విష్ణు ముత్సుకో బ్రాహ్మణ స్తదా ॥ 65

స్వప్నమునందు జడలు ధరించిన యా బ్రాహ్మణుడిట్లు చెప్పుచున్నాడు. ఓ ధనంజయా! ఆనాడు ప్రేమతో అన్నమును గౌరవించి భుజించిన రాజకుమారుడు యీ నాడు మోక్షదాయినియైన కాశీ పట్టణమునందు మీ యన్న అయిన దేవదత్తుడుగ జన్మించి. ధన, ధాన్య, పుత్ర, పౌత్రవంతుడై సుఖంబున నున్నాడు. అక్కడ వున్న హేరంబుడు కొంచెము అన్నము తినుటచేత బ్రాహ్మణుడవుగ నీవు పుట్టినావు అన్నమును గౌరవించకుండ పారవేయుటచేత దరిద్రుడవైనావు. ఎవరు అన్నమును గౌరవించరో వారు అన్నహీనులు అవుతారు. దుఃఖ భాగులవుతారు. బుద్ధిమంతు లయినవారు రుచిలేని అన్నమునైన అమృతమువలె పారవేయక గౌరవించి భుజించెదరు. ఓ బ్రాహ్మణుడా! నీవు అన్నపూర్ణ వ్రతమును చేయుము. దాని వలన నీకు అన్న దరిద్రము పోవును. సంపదకూడ నీకు సిద్ధించును. అవి చెప్పగ విని ఆ ధనంజయుడు ఆ వ్రత విధానము వడుగ సంకల్పించెను. యింతలోనే ఆ ధనంజయునికి మెళుకువ వచ్చినది.

60 55

తత్యాజ్య నిశాం భూయః పవిత్ర చిత్తా మహావ్రతాన్ ।
పవిచ్య వృద్ధా నవాంశ్చ నానాదేశ సమాగతాన్ ॥ 66

గ్రింథా నాలోక్య భూరీశ్చ నాద్యగచ్ఛ ద్ద్రవ్యోత్తమం ।
తద్విత్రా హ్యాతచేతాః సతతో బభ్రారు మేదినీం ॥ 67

నానావిధాని తీర్థాని భ్రిమ న్ప్రాప్తో ఽశమం గతః ।
స సమభ్యర్చ్య కామాక్షీం పరిసర్ప న్నిత స్తతః ॥ 68

ఉత్తరే వరస స్తీరే మేరో రుత్తర సంకుటే ।
దివ్య కౌశేయ సంవీతాః దివ్య వే వద్య పేశలం ॥ 69

దివ్యస్త్రీ సార్థ మన్దాత్రీ దద్వ యత్తం శివ ప్రియాం ।
ఉపవ్యచ్య తతో విప్రః ప్రాహేదం వినయాన్వితః ॥ 70

పాదస్యః కిమే తదా రద్ధిం వ్రితం కోఽన్యా విధిః స్మృతః ।
కిం ఫలం కుత్ర సమయే క్రియతే వ్రత ముత్తమం ॥ 71

అది మొదలుకొని ఆ అన్నపూర్ణ వ్రత విధానమును తెలిసికొనుటకు ఆలోచించుచుండెను. అనేక దేశములనుండి వచ్చుచున్న యాత్రికులను వృద్ధులను యితర పెద్దలను అన్న పూర్ణ వ్రత విధానమును అడుగుచుండెను కాని. ఆ వ్రత విధానము తెలియలేదు. అనేక గ్రంథములు పరిశీలించెను. కాని వ్రత విధానము దొరకలేదు.

ఆ ధనంజయుడు అన్నపూర్ణ వ్రత విధానమును తెలిసి కొనవలయునను దృఢసంకల్పముచేత దేశ పర్యటనకుపక్రమించెను. అనేక తీర్థములు సేవించుచు ప్రాగ్జ్యోతిషముచేరి. (కామరూప దేశము) అచ్చట నున్న కామాక్షి దేవిని పూజించి అక్కడ తిరుగుచుండెను. అక్కడ సమీపమున వొక పర్వతమున కుత్తర భాగమునందొక సరోవరము కనుపించినది. దాని సమీపమున దేవతా స్త్రీలు పార్వతీ దేవి పూజ చేయుచుండిరి. వారు పట్టు చీరెలు కట్టుకొని సహజమైన శృంగారముగల దేవతలనుగా మాచి వారివద్దకువెళ్లి వినయ పూర్వకముగ నడిగెను.

ఓ పతివ్రతలారా! మీరు యిక్కడ చేయుచున్న వ్రత మేమి! దీని విధానమేమి ? యీ వ్రతము చేసినందున ఫలమేమి. అని ధనంజయుడు అడిగెను 68-71

శృణుష్వైక మనా దేవి శివో హ్యద్యా శక్తి సమన్వితః ।
సచ్చిదా నన్ద రూపస్య శక్తిర్యా పరమాత్మనః ॥ 72

ఏకదా బహుధా సా చ యయా సర్వమిద న్తతం ।
శివ శక్త్యాత్మకం విద్ధి జగదేతచ్చరాచరం ॥ 73

యః శివః స హి విశ్వేశః శక్తిర్యా సా చ పార్వతీ ।
మా యేతి కీర్త్యతే సృష్టా వన్న పూర్ణేతి పాలనే ॥ 74

సంహృతౌ కాళరాత్రీతి త్రిధా సైకా ప్రకీర్తితా ।
తస్యాస్త దన్నపూర్ణా యాః వ్రత మేతచ్ఛుభ ప్రదం ॥ 75

## వ్రత విధానము

ఓ బ్రాహ్మణోత్తమ! శ్రద్ధ, భక్తి, నిశ్చలమయిన మనస్సుగలవాడవై వినుము. సచ్చిదానన్ద స్వరూప మగు పరమాత్మయే శక్తి. ఆ శక్తియే ప్రపంచమును సృష్టించు చున్నది. ఏక స్వరూపమైన యాశక్తియే అనేక రూపములుగ ప్రకాశించుచున్నది. ఈ ప్రపంచమంత శివ శక్తిచేత వ్యాపింప బడి యున్నది. శివుడే విశ్వేశ్వరుడు. శక్తియే పార్వతి శక్తి సృష్టియందు మాయా యనియు, పాలనయందు అన్నపూర్ణా యనియు లయమునందు కాళరాత్రి యనియు చెప్పబడు చున్నది. ఇక్కడ జరుగుచున్న వ్రతము శుభ ప్రదమయిన అన్నపూర్ణా వ్రతము. 72-75

మార్గశీర్షేతు పంచమ్యాం కృష్ణాయాం ప్రాత రాప్లుతః ।
పట్టసూత్రి మథో సూత్రం గృహీత్వా కుంకుమారుణం ॥ 76

దద్యాత్సప్త దశ గ్రన్థీ శ్చన్దనాగరు చర్చితాన్ ।
స్థాపయిత్వాన్నపూర్ణాచ దోరకం ధారయేత్పునః ॥ 77

పూజయే దంబికాం దేవీ ముపచారై ర్మనోరమైః ।
గృహీత్వా హారితా సప్త దశ విపాత్రిక కానిచ ॥ 78

ఓం అన్నపూర్ణే ద దస్వాన్నం పశూన్పుత్రా వ్యశశ్శ్రియం ।
ఆయురారోగ్య మైశ్వరం దేహి దేవి నమోస్తుతే ॥ 79

అనేన దోరకం బధ్వా బాహు మూలేతు దక్షిణే ।
పుమా న్వామే పునః నారీ సచేతా శృణు యాత్కథాం ॥ 80

గృహీత్వా హారితాః సప్త దశ విపాత్రిక తాన్ప్రదా ।
కథాన్తే పూజయే త్తైస్తు మన్త్రై ణానేన డోరకం ॥ 81

సర్వశక్తి మయీ యస్మా దన్నపూర్ణే త్వముచ్యసి ।
సర్వ పుష్పమయీ దూర్వా తాస్మాత్తుభ్యం నమోస్తుతే ॥ 82

ఇత్యేవం షోడశాహాని కథాం సంపూజ్య డోరకం ।
దినే సప్తదశే ప్రాప్తే షష్ఠ్యాం పక్షే తథాసితే ॥ 83

మార్గశీర్ష కృష్ణ పంచమీ దినమునందు ఉదయమున లేచి నదియందు కాని తటాకమునందు కాని సరస్సునందు కాని స్నానము చేయవలయును. పట్టు దారమును పదహారు పరుసలుగ చేసి దానికి పదహారు ముళ్లు వేయ వలయును. దానిని కుంకుమచేత బాగుగ తడుపవలయును. ఒక ఆసనము నేర్పరచి దానిమీద బియ్యము పోయవలయును. ఆ బియ్యముమీద యీ తోరము నుంచి అన్నపూర్ణా దేవిని ఆవాహనము చేయవలయును. ఆవాహనాది షోడశోపచార పూజలు చేయవలయును. దేవిని యీ క్రింది విధముగ ప్రార్థించవలయును.

ఓ దేవి! నాకు అన్నము పశు పుత్ర, కీర్తి, లక్ష్మి మొదలగు సంపదల నివ్వుము. అయురారోగ్య అయిశ్వర్యముల నిమ్ము. నీకు నమస్కారములు చేయుచున్నానని ప్రార్థించవలయును. అటు తర్వాత ఆ తోరమును పురుషుడు కుడిచేతికి కట్టుకొనవలయును. స్త్రీ ఎడమచేతికి కట్టుకొనవలయును. ఈ వ్రత కథను వినవలయును. యీ విధముగ పదహారు రోజుల వరకు ప్రతి దినము నదీ, బావి, లేక కొళాయి (నల్లా) స్నానము చేసి తన యింటిలో ఆ తోరమునకు పూజ చేసి నమస్కార ప్రార్థనలు చేసి తోరమును కట్టుకొని వ్రత కథను వినుచుండవలయును.

శుక్లాంబరధరో రాత్రౌ వ్రతీ పూజా గృహేస్థితః ।
శాలివల్లిభిః క్లుప్తం స్థాపయే త్కల్ప పాదపం ॥ 84

అధస్తా దన్నపూర్ణా యాః స్థాపయే న్మూర్తి ముత్తమం ।
జపా పుష్ప ప్రతీకాశాం త్రినేత్రో ల్లసితా ననాం ॥ 85

సుధా కరలస న్మౌళిం నవయౌవన మండితాం ।
బంధూక బంధ నిచయాం దివ్యాభరణ భూషితాం ॥ 86

స్మేరాననాం సుప్రశాన్తాం రత్నసింహాసన స్థితాం ।
వామే మాణిక్య పాత్రంచ పూర్ణ మన్నేన దర్శయేత్ ॥ 87

దక్షిణే రత్న దర్వీంస్తు కరేతస్యాః ప్రదర్శయేత్ ।
కర్ణికాయాం లిఖేత్త్వేవం పద్మే షోడశ పత్రకే ॥ 88

పూర్వాది పత్రేషు లిఖేన్నదినీ మదమే దినీం ।
భద్రాం గంగాం బహురూపాం తితిక్షాం దైశకోత్తమః ॥ 89

మాయాం హేతిం ప్రపాతం చ రిపుహన్త్రీం తథాన్నదాం ।
వంతాం పూర్ణాం రుచివేత్రాం స్వామి సిద్ధాం చ హాసినీం ॥ 90

పదిహేడవరోజు (అనగ) పుష్యశుద్ధ షష్ఠి రోజున వ్రతము చేయువారు నదీ స్నానముచేసి తెల్లని వస్త్రములను ధరించవలయును. రాత్రికాగానే తనయింటిలో రంగులతో షోడశదళపత్రపద్మమును నిర్మించ వలయును. ఆ పద్మమధ్యము నందు పరిధాన్యపు మొక్కలచేత కల్పవృక్షమును నిర్మించ వలయును ఆ వృక్షము క్రింద అన్నపూర్ణాదేవి విగ్రహము నుంచవలయును ఆ దేవి విగ్రహమును యీ క్రింద చెప్పిన విధముగ అలంకరించ వలయును. దాసాని పుష్పమువలె ఎఱ్ఱని శరీరఛాయ వుండవలయును ముఖమునందు మూడు నేత్రము లుండవలయును శిరస్సునందు అర్ధచంద్ర బింబముండ వలయును. నవయవ్వన మట్టిపడునట్లుండవలయును మంతెన (బంధూక) (దాసాని) పుష్పముల గుత్తులు నాలుగు వైపుల నుంచవలయును ఆ మూర్తికి దివ్యభూషణములతో అలంక రించవలయును. ఆ మూర్తిని చిగునగపు కలదానినిగా చిత్రించ వలయును ఆ విగ్రహము బంగారు సింహాసనమునందు ప్రకా శించు చుండవలయును ఆ మూర్తి ఎడమ చేతియందు అన్నముతో నిండిన మాణిక్యపాత్ర (కుండ) నుంచవలయును. కుడిచేతియందు రత్ననిర్మితమయిన గరిటె నుంచవలయును. షోడశదళ కమలమున దు తూర్పు మొదలు వరుసగ నందిని, మోదిని, భద్రి, గంగ, బహురూప, తితిక్ష, మాయా, హోతి, స్వసా, రిపుమర్దినీ అన్నదా, నన్దా, పూర్ణా, రుచినేత్రా, స్వామి సిద్ధా, హాసినీ, అనుదేవతా స్వరూపములను ప్రతిష్ఠించవలయును.

గృహాణే మాం మయా దత్తాం పూజాం దేవి నమోస్తుతే ।
వరాభయప్రదాః సర్వాః బంధూక కుసుమ ప్రభాః ॥ 91
ఆవాహ యిత్తతో దేవీం గృహీత్వా కుసుమాంజలిం ।
ఏహ్యేహి దేవి దేవేశి దేవ దేవేశ వల్లభే ॥ 92
గృహాణే మాం మయా దత్తాం పూజా దేవి నమోస్తుతే ।
ఇత్యావాహ్య తతః పాద్య మన్నధాత్రై నమోర్పయేత్॥ 93
అర్ఘ్యంగిరీశ కాన్తాయై ఉమాయాచమనీయకం ।
మధు పర్కం జగన్మాత్రే గిరిజాయై చ చందనం ॥ 94
దత్వా సంపూజయేత్పుష్పాక్షతాద్యై ర్మన్త్ర ముచ్చరేత్ ।
న మోగిరీంద్ర తనయాయై జగన్మంగళ మంగళే ॥ 95
శ్రీ మహేశాత్మ మహిషి స్కంద మాతా నమోస్తుతే ।
ధూపం దీపంచ నైవేద్యం వస్త్రం సింధూర భూషణం ॥ 96
తాంబూలం ముఖవాసంచ సర్వమేతేన దర్పయేత్ ।
తతః ప్రదక్షిణీ కృత్య దండవత్ప్రణి పత్యచ ॥ 97
ఉత్తార్య డోరకం బాహో ర్దేవి చరణ యోర్న్యసేత్ ।
సర్వ సంపత్ప్రదే దేవి డోరకం విధృతం మయా ॥ 98
వ్రతం సంపూర్ణ మభవత్ గృహాణ జగదంబికే ।
భృత్యోహం తవదేవేశి పాల్యం తవ జగత్ప్రియం ॥ 99
వ్రతే నానేన వరదే పాహి భృత్య మనుత్తమం ।
కథాం శృత్వా చ గురవే దత్వా సంతోష్య దక్షిణాం ॥ 100
పాత్రాణి సప్త దశ చ పక్వాన్నైః పూరితానిచ ।
కృత్వా తాసద్విజేభ్యోఽపి భోజయేచ్చ సువాసినీః ॥ 101
స్వయం భుక్త్వా త్వలవణం కుర్యాద్రాత్రౌ మహోత్సవం ।
ప్రాతర్విసర్జయేద్దేవీం ప్రణిపత్య క్షితిం గతః । 102

శ్రీ సూక్త విధానముగ ధ్యానా వాహనాది షోడశోప చార పూజలు యథావిధిగ చేయవలయును. తోరమును చేతి యందు ధరించవలయును. కథా శ్రవణము చేయవలయును. వ్రతము చేయించిన బ్రాహ్మణుని గౌరవించి భూరిదక్షిణ లిచ్చి సంతోష పరువవలయును. భక్ష్యములతో నింపిన పదిహేడు పాత్రలను పదిహేడు మంది బ్రాహ్మణులకు యివ్వవలయును. బ్రాహ్మణులతోను స్త్రీలతోను కలిసి భుజించవలయును. రాత్రి ఉప్పు లేకుండ భోజనముచేసి భక్తిగీతములతోను నృత్యముల తోను జాగరణము చేయవలయును. మరల ప్రాతఃకాలమున లేచి అన్నపూర్ణాదేవికి సాష్టాంగ నమస్కారముచేసి దేవి ఉద్వా సన చేయవలయును.

పూజాస్థలము నందుంచిన ధాన్యము యింటి యజమాని భుజించవలయును, ఇతరులకు యివ్వవచ్చును. 91-104

అహమేష వధూరేషా శివోమే తవానుగః ।
మాత స్తవాంఘ్రి కమల గతి కా ఇతి చిన్తయ ॥ 103
క్షమస్వ త్రిజగద్ధాత్రి కురు నిత్యం కృపాం మయి ।
ధాన్య కుల్పం తతో విప్ర పూజా దావునయో జయేత్ ॥ 104

భుంజీతవా స్వయంగేహే అన్యస్మై ప్రతిపాదయేత్ ।
తతః సప్త దశే వర్షే వ్రతోద్యాపన మాచరేత్ ॥ 105

పాత్రాణి పూర్వ వత్కృత్వా వస్త్రాచ్ఛన్నాని వస్తుభిః ।
దద్యాద్ద్విజేభ్యో ధేనూశ్చ గురవేఽన్నం పటత్రయం ॥ 106

మహా న్త ముత్సవం కుర్యా ద్భుంజీత జ్ఞాతి భిస్సహ ।
ఏ తత్తే కథితం విప్ర సర్వ సంపత్ప్రదం వ్రతం ॥ 107

న దద్యాన్నా స్తికాయై తద్వికల్పేవ హాత్మనే ।
భక్తి శ్రద్ధా విహీనాయ దాంభికాయ శఠాత్మనే ॥ 108

దేయం శ్రద్ధావతే దేవ పితృ భక్తాయ జ్ఞానినే ।
తతః స విస్మయా విష్ణో విప్రో హ్యాప్త తనూరుహః ॥ 109

## ఉద్యాపన విధానము

పదిహేడవ సంవత్సరమునందు. ప్రతి సంవత్సరము చేసిన విధముగనే పూజాకార్యమును పూర్తిచేయవలయును. పదిహేడు మంది బ్రాహ్మణులకు భక్ష్యములతో నిండిన పదిహేడు పాత్రలను వస్త్రములతో చుట్టి యివ్వవలయును. గోదానము చేయవలయును. పురోహితునికి భోజనముపెట్టి మూడు పట్టు వస్త్రములు నివ్వవలయును. బంధువులతోను, స్నేహితులతోను కలిసి భోజనము చేయవలయును. ఓ బ్రాహ్మణుడ! సంపద నిచ్చు యీ అన్నపూర్ణ వ్రతమును మేము నీకు తెలియచేసినాము. అహంకారము గలవానికి, చంచల స్వభావము కలవానికి శ్రద్ధ భక్తి లేనివానికి యీ వ్రతమును చెప్పకూడదు. అని ఆదేవతా స్త్రీలు చెప్పగ విని బ్రాహ్మణుడు సంతోషించినాడు. వాకష్టము నెరవేరినదని హర్ష పులకిత గాత్రుడై ఆ దేవతాస్త్రీలకు నమస్కరించెను.

ఆ ధనుంజయుడు వినయముతో ఆ దేవతాస్త్రీలతో కలిసి అన్నపూర్ణా వ్రతమును చేసెను. 105-109

చక్రే వ్రతం నమస్కృత్య సార్థం జానన్కృతార్థతాం ।
మత్తమాతంగం సంరుద్ధం తురంగై రుపబృంహితం ॥ 110

బభూవ తస్య భవనం స్వర్ణ సోపాన శోభవత్ ।
దాస్యః కమల పత్రాక్ష్యో నిష్కకంఠ్యః సువాససః ॥ 111

విచరన్తి గృహే తస్య భృత్యా రాజసుతో పమాః ।
లక్ష్మీ వై శ్రీవణస్యేవ వత్సరాభ్యన్తరేఽభవత్ ॥ 112

అథ విప్రో యువా చక్రే వివాహ మపరం సుఖీ ।
భిన్నశోభాలయే కామీ కామయా మాస కామినీం ॥ 113

ఏకదా జ్యేష్ఠ భార్యాయాః గృహే తిష్ఠ న్ద్విజాగ్రణీః ।
మార్గశీర్షేఽన్నపూర్ణాయాః బబన్ధ వ్రత దోరకం ॥ 114

యయౌ కనిష్ఠ భార్యాయాః గృహే భుక్త్వాఽథ కౌతుకీ ।
స్ఫీత పర్యంకగః కాన్తో పాత్త పర్ణోథ (యో) భోగవాన్ ॥ 115

సంవత్సర ద్వయారూఢాం క్రీడాం రేమె సంగమయ న్నపాం ।
రమమాణస్య సా దృష్ట్వా దోరకం స్త్రీ స్వభావతః ॥ 116

సపత్నీ శంకితా భిత్వా దాస్యావహ్నాన్న పాతయత్ ।
కామాసక్త స్తదా విప్రో న బుబోధా న్య వాసరే ॥ 117

## వ్రతఫలము

ఈ అన్నపూర్ణ వ్రత ప్రభావము చేత ఆ ధనుంజయునికి విశాలమయిన దివ్యభవనము కలిగినది. బంగారు సోపానములు, బంగారు కప్పు కలిగినది. ద్వారమునందు ఏనుగులు ఘీంకరించుచున్నవి. అశ్వశాలయందు గుర్రములు సకిలించుచున్నవి. ఆ ధనంజయుని గృహము నందు సువర్ణ భూషణములు ధరించి మెడలయందు రత్నాల హారములు ధరించి పట్టు వస్త్రములు కట్టుకొని విశాలమైన నేత్రములు కల దాసీజనము అటుయిటు తిరుగు చుండిరి. ఆయన సేవకులు రాజ కుమారులా అన్నట్లు వుండిరి. ఒక సంవత్సరము లోనే యిన్ని సంపద చేకూరినది. ఆ ధనుంజయుడు యువకుడుగ నుండెను. బహు సుఖసంతుడుగ నుండెను.

ఆ ధనుంజయుడు గొప్ప అయిశ్వర్యము ననుభవించుచు రెండవ వివాహము చేసుకొనెను. మరియొక రాజ భవనములో ఆ రెండవ భార్యతో సుఖపడుచుండెను. ఒక పర్యాయము. ఆ ధనుంజయుడు పెద్ద భార్యయందుండగ మార్గశిర బహుళ పంచమి (అనగ) అన్నపూర్ణ వ్రత దినము సంప్రాప్తించినది. ఆరోజు అన్నపూర్ణ వ్రతముచేసి తోరము కుడిచేతికి కట్టుకొని వాడు. ఒకనాడు ఆ బ్రాహ్మణుడు రెండవ భార్య యింటికి వెళ్లి ఆమె ఉపచారముల నంది ఉపహారముల తీసికొని ఆనందముతో దివ్యమైన తెల్లని పరుపు పరచిన మంచము మీద కూర్చుండెను. కామవతి యయిన రెండవ భార్య ఆనందదాయకమయిన తాంబూలము నివ్వగ తాంబూలమును వేసుకొని ఆనంద ప్రవాహములో మునిగి నానా ప్రకారములయిన కామ క్రీడ

కథాసుతే డోరక వ్రతమ పృచ్ఛత్త నిజాన్ననాత్ ।
సతో౽స్య కథయత్తస్య తతో౽సా సస్య డోరకం ॥ 118

బబంధాథ తత స్తస్య క్షీణా లక్ష్మీ ర్దినే దినే ।
వత్సరాన్తరే భూయః స ఏవాసీ ద్ధనంజయః ॥ 119

తథాపి సామిన్త్తస్య ప్రాయశో వికలాత్మనః ।
పునశ్ఛిన్నా కులో౽సాదీ ద్దస్తమే డోరకం హృతః ॥ 120

తతః ప్రభృతి మే భూయో దారిద్ర్యం సముపస్థితం ।
కుర్వతోపి వ్రతం దేవ్యా న మే సందృశ్యతే ఫలం ॥ 121

తథాపి లభ్యతే పూర్వమిదానీం సాపి మే గతా ।
తత్వం పృచ్ఛామి కం వాస్య యథాన శ్రీ వినాశనం ॥ 122

లలో మునిగి సరస సల్లాపము లొనర్చుచు సుఖించుచుండెను ఆ బ్రాహ్మణుడు భార్యతోడ సరసాలాపాది సుఖములలో మునిగియున్న సమయములో ఆయన రెండవభార్య తన భర్త చేతికి కట్టబడియున్న తోరమును చూచినది. స్త్రీ స్వభావముచేత సత్యమును తెలుసుకొనలేక తన సవతి భర్తను వశీకరణ చేసుకొనుటకు కట్టి యుండునని తలచి ఆ తోరమును త్రెంపి ఆయనకు తెలియకుండ దాసిచేత అగ్నిలో పడవేయించినది. ఆ బ్రాహ్మణుడు కామాంధుడై యీ విషయమును గుర్తించలేదు. 111-117

రెండవ రోజు మరల పూజ కథా శ్రవణ సమయము వచ్చినది. అప్పుడు తోరము జ్ఞాపకము వచ్చినది, నా చేతి తోరమెట్లు పోయినదని సేవకుల నడిగెను. ఎవరికి తెలియదు. ఎవరు సమాధానము చెప్పలేదు. ఆ ధనుంజయుడు మరల తోరమును కట్టుకొనెను. అయినను, ఆ దివసమునుండి క్రమముగ సంపద నంతయు క్షీణించినది. మరల పూర్వమువలెనే దరిద్రుడయ్యెను. తిండికూడ దొరకలేదు. 118-123

తత్కామరూప మేవాహం గత్వా పృచ్ఛామి తాః స్త్రియః ।
ఇతి నిశ్చిత్య సోఽగచ్ఛత్తం దేశం వశిత మాత్రవాన్ ॥ 123

న తత్ర దృశ్యతే కించి త్పూర్వ దృష్టం పురాదికం ।
సర్వతోఽపి మహారణ్యం జన్తు సంచార వర్జితం ॥ 124

పక్షీ న లక్ష్యతే తత్ర కా కథా మనుజ యహి ।
ఇత స్తతః పరిభ్రమ్య చిన్తయా మాన స ద్విజః ॥ 125

యేన పాపేసమే జాతో ఘోరకః కేనచి ద్ధృతః ।
తేన కింభవితా లాభో విహత వ్రత కస్యమే ॥ 126

క గతా సా పురీ రమ్యాక్వ పరః క్వమురాలయః ।
మానం మద్భాగ్య దోషేణ పమస్తం విధినా హృతం ॥ 127

ధిక్ మాం దైవతం స్వర్గా దృష్టింశితం దుఃఖభాజనం ।
తత్కిమే నిర్దయా పాపైః రహితైః క్లేశ కోటదైః ॥ 128

ఆ బ్రాహ్మణుడు చింతా క్రాంతుడయ్యెను నా చేతి తోర మెక్కడ పోయినది అప్పటినుండి దరిద్రము మరల వచ్చినది. దేవీపూజ చేసినప్పటికిని నాకు ఫలము కనపించలేదు. యీ విషయము నెవరిని అడుగుదును. ఎవరిచేత నాకీ దరిద్రము పోవును. అని ఆలోచించి మరల కామరూపదేశము పోయి యా దేవతా స్త్రీలనే అడుగుదును. అని నిశ్చయము చేసుకొని ఆ కామరూప దేశమునకు పోయెను కాని ఆ నాడు బ్రాహ్మణుడక్కడ చూచిన పట్టణము కాని, పర్వతము కాని, కామాక్షీ ఆలయము కాని యేది అగుపడలేదు. భయంకర మయిన అడవి మాత్రమే కలదు. దానిలో యేవిధమైన జీవ జంతువులుకూడ లేవు. ఏమి తోచక అటుయిటు తిరుగుచు ఆలోచించుచుండెను. ఏ పాపముతో నాచేతి తోరము పోయినదో. ఏ పాపముచేత నా వ్రత భంగమయినదో ! ఆ పాపము చేత నాకు కొంచము కూడ మంచి కలుగలేదు. అందమయిన పట్టణ మేది ? ఆ పర్వత మెక్కడ ? ఆ దేవాలయ మెక్కడ ? నా భాగ్య దోషము చేత భగవంతుడె అన్ని హరించివాడు. నేను భగవంతునికి అపకారము చేసి వ్రత భ్రష్టుడనై దుఃఖ మనుభవించుచున్నాను. కోట్ల కొలది కష్టముల నిచ్చు యీ ప్రాణముల నుంచుకొని యేమి చేయవలయును. యిట్లు ఆలోచించి మరణించవలయునను కోరికచేత యెదురుగ నున్న భావిలో దూకెను.

128-128

ఇత్యుక్త్వా పురతః సూమే మర్తు కామోఽవ తత్తదా ।
పతితో నిర్వ్యథోఽ దాసౌ ప్రకాశం దదృశే తదా ॥ 179

వథా సద్వ సుయాతేన ప్రకీర్ణ దేశముత్తమం ।
నానోద్యాన లతా కీర్ణం నానా మృగ నిషేవితం ॥ 180

మయూర నృత్య సంశోభిః సాను పర్వత మండితా ।
మత్తకోకిల గీతాఢ్యం భృంగ సంగీత పేశలం ॥ 181

కాననం దృశ్యతే తత్ర సర్వర్తు కుసుమోజ్జ్వలం ।
ఫలన మ్రైస్తరు వరైః రచితం కదలీచయైః ॥ 182

విస్మయోత్ఫుల్ల నయన స్తదా పశ్యన్ ద్విజాత్మజః ।
దదర్శ సాగర ప్రాయం సరః ప్రోత్ఫుల్ల పంకజం ॥ 183

హంస కారండ వాకీర్ణం చక్రవాక కులాకులం ।
మీన పుచ్ఛోచ్ఛలత్తోయ మిద్ధ తారాంశ తాంబరం ॥ 184

తరంగోత్కీర్ణ పవన శ్లిష్ట వేతస మండపం ।
నానా మణితటాక్రీడ దేవ కన్యా కృతార్చనం ॥ 185

ఆ కావిలో పడగనే అతనికున్న బాధలన్ని పోయినవి. నాలుగు వైపుల బ్రహ్మాండమయిన వెలుతురు కనిపించినది. ఆ మార్గము నుండి పోవుచుండగ విశాల మయిన దేశము కనుపించినది. అనేక రకములయిన ఉద్యానవనములు కనుపించినవి. ఆ వనములు లతా పుంజములచేత కోకిల్లు చుండినవి. అనేక రకములయిన వన్య మృగములు తిరుగుచున్నవి. పర్వత చరియ లందు నెమళ్లు నృత్యము చేయుచున్నవి. మత్త కోయిలలు కుహూ కుహూయని అరచుచున్నవి. తుమ్మెదలు ఝంఝమ్మను ధ్వనులు చేయుచున్నవి. ఆ వనమందు అన్ని ఋతువులందు పూయు పుష్పములు వికసించియున్నవి. శ్రేష్ఠములయిన ఫలవృక్షములు ఫలముల బరువుచేత వంగివున్నవి. అరటి వృక్షములు పూగుచున్నవి. ఆశ్చర్యముతో సంతోషించుచు యీ యానందమును చూచుచు యా బ్రాహ్మణుడు నడిచి పోవుచుండెను. 128-132

## సరోవర వర్ణనము

ఎదుట ఆ బ్రాహ్మణునికి సముద్రమువలె విశాల మయిన వొక సరోవరము కనుపించినది. దానియందు వికసించిన కమలములున్నవి, హంసల చేతను, నీటి కోళ్లు (బాతుల) చేతను నిండివున్నవి. చేపలు తోక లాడించుటచేత నీరు కదలుచుండెను. రాత్రి కాలమందు ఆకాశము నందున్న చంద్రుడు నక్షత్రములు సరోవరమునందు ప్రతి బింబించుచున్నవి. ఆ సరోవరము నందలి అలలు వొడ్డు వరకు వచ్చుచున్నవి. చల్లని మలయ మారుతము వీచుచున్నది ప్రబ్బలి చెట్లతోను నానావిధ మణులతోను కూడిన సరోవరపు గట్లమీద ఆడుచు పాడుచున్న దేవతా స్త్రీలు పూజలు చేయుచుండిరి 133-135

అథా పశ్యతు సంగీతం సరసః పశ్చాత్తదా శుకోత్తమం ।
షడ్జ గాన్ధార జాత్యగ్రం దివ్యగేయ మనుత్తమం ॥ 136

మృదంగ వేణు పణవ కోకిలా స్వరమండితం ।
శనైరను సరద్రమ్య స్ఫటికా వాస మృద్ధితం ॥ 137

రత్న విద్రుమ సోపానం చతుర్ద్వారం వ్యలోకయత్ ।
సవివేశ తతో శ్యన్తర్ద దృశే మణి మండపం ॥ 138

తస్య మధ్యే పరివృత్యాస్తం పురుషం స్ఫటిక ద్యుతిం ॥
చంద్ర చూడం త్రినయనం జటిలం ఫణి భూషణం ॥ 139

నానా కారాన్స పురుషా న్సంగీతం కుర్వతోద్భుతం ।
తదగ్రే రత్న పర్యంకే సుఖా సీనాం మనోరమాం ॥ 140

నవ యౌవన సంపన్నాం దివ్యాలంకార భూషితాం ।
కర్పూర శకలై ర్మిశ్రి తాంబూల పూరి తాననాం ॥ 141

బంధూక బంధు నిచయాం బంధూ కారుణ విగ్రహాం ।
కర పల్లవే వహస్తీం దివ్య తాంబూల వీటికాం ॥ 142

చామ రాన్దో ళనో ద్వేలా తక్కర్ణ పూరాలకా ననాం ।
ముఖవానోవ యోగాశ్యస్యా నిత్య ల్లామారస స్మితాం ॥ 143

సఖీభి ర్దివ్య రూపాభిః సేవ్యమానాం మహేశ్వరీం ।
కోయం కోఽయమితి వ్యగ్రి స్త్రియా వేత్రేణ వారితః ॥ 144

## దేవి వైభవము

ఆ సరోవరము వెనుకవైపు నుండి వచ్చుచున్న సంగీత ధ్వనిని యా బ్రాహ్మణుడు వినెను. ఆ సంగీతము షడ్జమ స్థాయిని చేరి ఉత్కృష్ట గంభీరమై యున్నది. మృదంగము (వేణు) పిల్లనగ్రోవి ధ్వనులు మృదువై కోయిల కంఠ స్వర మునకంటె మధురముగ నున్నవి. ఆ వాయిద్య మధ్యమము నందు స్ఫటిక మణివలె తెల్లని కాన్తిగల వొక పురుషుడు నృత్యము చేయుచున్నాడు. ఆ పురుషుని శిరమున చంద్ర రేఖయు ముఖము నందు మూడవ నేత్రము కలదు. శిరమున జడలు కూడ వున్నవి. ఆ పురుషుడు సర్పములను భూషణము లుగ ధరించి యున్నాడు. అనేక మంది పురుషులు అక్కడ అద్భుతముగ గానము చేయుచుండిరి. వారికి ముందు రత్న నిర్మితమైన (మంచము) పీటమీద కూర్చొని అతి సుందరమై భగవతియైన మహేశ్వరిని ఆ బ్రాహ్మణుడు చూచినాడు. ఆమెకు దివ్య సుందర శరీరముగల స్త్రీలు సేవచేయుచుండిరి. ఆ దేవి నవయౌవనము కలిగి దివ్య రత్నాభరణములతో అలంక రింపబడియున్నది. కర్పూర పరిమళ మిశ్రమైన తాంబూలముమ వేసుకొని యున్నది. (బందూక) దాసాని, మంకెన, పుష్ప గుచ్ఛములు ఆ వేదికకు నాలుగు వైపుల కట్టబడియున్నవి. ఆ దేవి శరీరము (బందూక) మంకెన దాసాని పుష్పమువలె ఎఱ్ఱనై ప్రకాశించు చున్నది. ఆమె చేతియందు తాంబూల

దేవ్యా భ్రూ సంజ్ఞయా భూ యస్తయైవా న్తర్హి తేరితః ।
దండ వత్ప్రణి పత్యాథ విప్రః సాధ్వస పూరితః ॥ 14

న కించి ద్వక్తు మశక్తో జనోఽవ హిత వ్రతః ।
తమువాచ సమాశ్వాస్య సఖీ తాంబూల వాహినీ ॥ 14

పీటిక యున్నది. ఆమెకు రెండు వైపుల చమరీ మృగ సిద్ధ మయిన వ్యజనము లున్నవి. చవులయందు పుష్పములు కదలు చున్నవి. ముఖ మండలము నందు ముంగురులు కదలుచున్నవి. పరిమళింప చేయు వస్తువుంచేత సుగంధ మధుర రసభరితమై చిరునగవుతో ఆమె ముఖము మెరయుచున్నది. దివ్య రూప ములు గల చెలికత్తెలు ఆమె చుట్టు సేవించుచుండిరి. ఆమెకు ఎదురుగ కొంచము దూరములో నొక స్త్రీ చేతియందు బెత్తము పట్టుకొని తిరుగుచున్నది. అటువంటి దేవిని బ్రాహ్మణుడు సమీపించెను.

ఆ పహారా నిచ్చుచున్న స్త్రీ యా బ్రాహ్మణుని చూచి ఓ బ్రాహ్మణుడా నీవెవరవు. చెప్పుమని తనచేతి వేత్ర దండము చేత వాపినది. 183-144

అంత దేవి కనుసన్న చేసి ఆ బ్రాహ్మణుని లోనికి రానివ్వుమనెను. లోపలికి పోయిన బ్రాహ్మణుడు భయకంపితు డయ్యెను. ఆ దేవి తేజమ్ముచేత బ్రాహ్మణుని తేజమ్ము కను పించదయ్యె. ఆ బ్రాహ్మణుడా దేవికి సాష్టాంగ దండ ప్రణా మము చేసి యేమి మాట్లాడ లేకపోయెను. దేవికి తాంబూల మందిచ్చు స్త్రీ యా బ్రాహ్మణుని పేదదేర్చి యిట్లు చెప్పెను. 145-146

ఏవఁ యస్యాః పఁత్రం భక్త్యా భవా న్సర్వ సమృద్ధయే
ఏషా త్రైలోక్య జననీ సాఽన్నపూర్ణా మహేశ్వరీ ॥ 147

దుఃఖదారిద్ర్య శమనీ సర్వ సంపత్సమృద్ధిదా ।
సృష్టి స్థితి సంహార కరో యోఽసౌ మహేశ్వరః ॥ 148

స ఏవ భగవా న్రుద్రో నృత్య త్యేఽస్యాః పురః ప్రభుః ।
యోగ మాయాం సమాసాద్య క్రీడతే యో మహేశ్వరః ॥ 149

శివ ఏష ఇయం శక్తి ర్నామయే యం పురుష స్త్వసౌ
యత్కిఞ్చి ద్దృశ్యతే విప్ర సర్వమేత ద్ద్వయాత్మకం ॥ 150

న చాత్ర విస్మయః కార్యో దృష్ట్వా చేష్టితమే తయోః ।
లోకోత్తరాణాం చరిత్రం కోహి విజ్ఞాతు మీశ్వరః ॥ 151

త్వంచ భూయః కురు బ్రహ్మన్ వ్రతం భక్తి సమన్వితః ।
యత్పశీభిః పురోద్దిష్టం కామరూపే పర స్తపే ॥ 152

ప్రా ప్స్యసే విపులాం లక్ష్మీం కీర్తి మాయుః మహాన్పహాన్ ।
ఇంద్రోపి ఏవఁ భాగ్యా న్తే ప్రాప్నోతి విరహం క్రియః ॥ 153

బ్రహ్మాది దుర్లభం దేవ్యాః సంప్రాప్తం యేన దర్శనం ।
తతో జగామ విప్రోఽసౌ దండవ త్ప్రణతః పునః ॥ 154

ఓ బ్రాహ్మణుడ! నీవు సర్వ సమృద్ధమయిన ఫలము నిచ్చు ఏ వ్రతము చేసితివో? ఆ దేవియె యీమె మూడు లోకములకు తల్లియైన మహేశ్వరి అన్నపూర్ణాదేవి! సమస్త సంపద నిచ్చు తల్లి. సృష్టి, స్థితి, లయ, కారకుడైన పరమ పురుడు దేవి యెదుట నృత్యము చేయుచున్నాడు. ఈమెయె యోగమాయా. యీమె అనుమతిని పొంది, నృత్యము చేయు చున్నాడు. ఓ బ్రాహ్మణుడ! ఈ వీరిద్దరు శక్త, శక్తులు. యీమె శక్తి. యీమె మాయా. వారు పురుషులు ఏది తమ సించుచున్నదో అదంతయు శివశక్తి స్వరూపముతో వ్యాప్తమై యున్నది. నీవీ కార్యక్రమమును చూచి ఆశ్చర్యపడవలసినది లేదు. ఎవరు లోకోత్తరులని చెప్పబడుచున్నారో అట్టి వారి చరిత్రి నెవరు తెలుసుకొనగలరు. ఓ బ్రాహ్మణుడ! నీవు శక్తి పీఠములు కలిగిన మరల కామరూప దేశమునందు స్త్రీలు నీకు చెప్పిన వ్రతము పాటింపుము. ఓ బ్రాహ్మణ! భాగ్యాత్మ మైనచో విరహార్తుడైన లక్ష్మి సంయోగమును పొందు చున్నాడు. మాతృవిహీన చేసిన పరిభావము చేత బ్రహ్మాది దేవతలకు దుర్లభమయిన నీ దర్శనము నీకు కలిగినది. అని యా స్త్రీ చెప్పగ విని యా బ్రాహ్మణుడు భూమిమీద సాగిల పడి సాష్టాంగ నమస్కారముచేసి యిటు ప్రార్థించెను.

147-154

దేవి ప్రసీద పరిపాలయ పాలనీయం ।
దారిద్ర్య దుఃఖ మపనీయ జగత్ప్రసీహి ॥ 155

ధన్యాస్త ఏవ గుణినః కులశీల యుక్తాః ।
మాత స్త్వయా కరుణయా కిల వీక్షితా యే ॥ 156

అపార తర సంసార పారకృత్తవ దర్శనం ।
తార యత్యఖిలం దోఽపి విశ్వేశ్వర నమోస్తుతే ॥ 157

తము వాదాన్న పూర్ణాధ విప్రైశ్రి తన్మే వ్రతం శుభం ।
యే కరిష్యన్తి లోకేఽస్మిన్తేషాం శ్రీః సర్వతోముఖీ ॥ 158

నాన్న దుఃఖం భవేత్యేషాం వియోగే నచ సంపదః ।
కీర్తి మన్తో రూపవన్తః ఉదారా రాజ పూజితాః ॥ 159

భవిష్యన్తి గుణాఢ్యాస్తే ధర్మశీలాః ప్రియం వదాః ।
సదాహం న విమోక్ష్యామి తేషాం వేశ్మ ద్విజోత్తమ ॥ 160

ఏషాం గేహే కదా ప్యేషా [illegible] భవిష్యతి ।
తత్ర తత్ర గమిష్యామి పూర్వవ ద్వర్ధసేఽధునా ॥ 161

ఓ దేవి! ప్రసన్నురాలవగుము. నన్ను క్షమించుము. రక్షించుము. దరిద్రమును తొలగొట్టి ప్రపంచమును పవిత్రముగ జేయుము. నీవు కరుణామయివి. నీ దృష్టి యెవనిపైన నుండునో వాడే ధన్యుడు. వాడే సుగుణవంతుడు. వాడే సత్కులముగలవాడు. వాడే శీలవంతుడు. ఓ పరమేశ్వరి! మీ దర్శనము అగాధమయిన సంసార సాగరమును తరింపజేయుచున్నది. సమస్త పాపములనుండి దాటుటకు నేను నమస్కరించుచున్నాను. 155-157

అప్పుడు అన్నపూర్ణాదేవి ఆ బ్రాహ్మణునితో నిట్లు చెప్పుచున్నది. ఓ బ్రాహ్మణుడ! ప్రపంచములో నెవరు యీ అన్నపూర్ణ వ్రతమును జేయుదురో వారికి అన్నివిధము లయిన సంపదలు చేకూరుచున్నవి. వారికెప్పుడు దుఃఖములు సంభవింపవు. సంపద లెప్పుడు తరిగిపోవు. యీ వ్రతము చేయువారు కీర్తివంతులుగను, రూపవంతులుగను, ఉదారులుగను, రాజ పూజితులుగను, గుణవంతులుగను, ధర్మాత్ములుగను, ప్రియవాదులుగను వుందురు. వారి యింట నేను సర్వకాలము లందు నివసించుచుందును. ఎవరి గృహము నందీ వ్రత కథ చదువబడునో వారి గృహమునందు నేను నివసించుచుందును. నేను సర్వదా ఆశీర్వదిస్తు వుందును. 158-161

కురు వ్రతం సదా మహ్యాం తవానుగ్రహ కామ్యయా ।
యాస్యామి కాశ్యాం విశ్వేశ దక్షిణే మే గృహం కురు ॥ 162

అథాబ్రవీ ద్ధరః ప్రీతః శృణు విప్ర పురే మమ ।
ప్రసన్నాననో మే గణో దండపాణిః ప్రియో మమ ॥ 163

స్థాప్యతి త్వత్ప్రియార్థం సదా త్వన్మనుజాం
యే కరిష్యంతి విప్రేంద్ర త్వద్భక్తిం జగతీ మానవాః ॥ 164

తేషాం కులే న దారిద్ర్యం భవిష్యతి కదాచన ।
అంతే వారాణసీం ప్రాప్య గణో మమ భవిష్యతి ॥ 165

భార్యా తే పార్వతీ తుల్యా ధనంజయ భవిష్యతి ।
తతః ప్రణమ్య విప్రోఽసౌ పార్వతీ పరమేశ్వరౌ ॥ 166

నేను నిన్ను అనుగ్రహించు బుద్ధిచేత కాశికి వెళ్లుదును. నీవు కాశీపట్టణమునందు విశ్వనాథస్వామివారికి కుడివైపున నా కొరకు మందిరము నిర్మింపుము. అని చెప్పగ ఆ విశ్వనాథ స్వామి యిట్లు చెప్పుచున్నాడు. 182

ఓ బ్రాహ్మణుడ! వినుమూ నా పట్టణములో నాకు ప్రియమైన గణములో ప్రసన్నవదనమైన దండపాణి యున్నాడు. అతను నీకు ప్రసన్నుడుగ నుండును. అతను సత్పురుషులకు అన్నదానము చేయుచున్నాడు. ఓ బ్రాహ్మణుడ! ప్రపంచములో నెవరికైతే అన్నపూర్ణ వ్రతము చేయుదురో వారి వంశమునందు కదాపి దరిద్రుడుండడు. నీ జీవితాంతమున కాశీ చేరి నాకు భక్తుడవుగ నుందువు. నీ భార్య పార్వతిగ మహాపతివ్రతయై యుండును. 183-186

కాశ్యాం గత స్తథా చక్రే త్వన్నపూర్ణా వ్రతం శుభం ।
పక్వాన్నం సంచయం కృత్వా చాన్నకూటం చకారసః ॥ 167

ఏ తత్తే కథితం రాజన్వ్రతానాం వ్రత ముత్తమం ।
యత్కృత్వా రామచంద్రోఽపి లేభే సౌఖ్యం
శ్రియం నిజాం ॥ 168

శ్రియ మిచ్ఛసి రాజ స్త్వం వృద్ధిశ్చైవ యశః సుతాన్ ।
తదా కురు మహా బాహో వ్రత మేత త్స్వబంధుభిః ॥ 169

మయా ప్యేతద్వ్రతం రాజన్క్రియతే భక్తితః సదా ।
ద్విత్రిషు భాగ్యవ త్స్వేషు తదా వర్ధ్యో భవిష్యతి ॥ 170

ప్రాయేణ భాగ్యరహితాన్ కరిష్య స్త్వథో వ్రతం ।
తే దగ్ధ హృదయాః పాపాః సదా లాలాటికా నృప ॥ 171

వృషభేంద్ర గతిం వన్దే చంద్ర చూడార్ధ ధారిణీం ।
కరుణార్ద్రి దృశన్దేవీ మన్నపూర్ణాం గిరిం ద్రిజాం ॥ 172

ఇతి శ్రీ భవిష్యోత్తర పురాణే శ్రీ కృష్ణ యుధిష్ఠిర
సంవాదే అన్నపూర్ణా వ్రత కథా సమాప్తా.

అన్నపూర్ణార్పణమస్తు
శుభమస్తు.

అని యా బ్రాహ్మణుండు పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించి కాశీపట్టణము చేరి శుభ ప్రదమైన అన్నపూర్ణ వ్రతమును చేసెను. భగవతీ యాజ్ఞానుసారము దేవాలయము నిర్మించెను. అన్నపూర్ణాన్నసత్రమును గూడ నేర్పరచెను.
167

ఈ కథను శ్రీకృష్ణ భగవానుడు చెప్పి మరల ధర్మరాజుతో నిట్లు చెప్పుచున్నాడు.

ఓ ధర్మరాజ! నేను నీకు చెప్పిన యీ వ్రతమును శ్రీరామచంద్రమూర్తి చేసి సుఖమును రాజ్యలక్ష్మిని బొందెను. లక్ష్మి బుద్ధి, కీర్తి, పుత్రులను కోరుచున్న నీవు నీతమ్ములతో కూడి యీ వ్రతము చేయుము. నేను కూడ యెల్లప్పుడీ వ్రతమును చేయుచున్నాను. మానవుడీ వ్రతమును చేయగనే భాగ్యవంతులలో శ్రేష్ఠుడగుచున్నాడు.

భాగ్యహీనులైనవాడు యీ వ్రతమును చేయడు. వాని హృదయము తపించి పోవుచుండును. వాడు మహాపాపియై అన్నదరిద్రుడై యుండును.

చంద్ర చూడుడై వృషభ వాహనుడై పోవుచున్న పరమేశ్వరునికిని పరమేశ్వరుని అర్ధాంగియై కరుణార్ద్ర దృష్టి కలిగిన అన్నపూర్ణా దేవికిని నమస్కారము చేయుచున్నాను.

ఇది భవిష్యోత్తర పురాణాంతర్గతమైన శ్రీకృష్ణ
యుధిష్ఠిర సంవాదము నందలి
అన్నపూర్ణా వ్రతకథ సంపూర్ణము.

## దేవీ ప్రార్థన

జయజయ భవానీ భవప్రియే భావాభావిత భావ భక్తమయే ।
జయజయ పార్వత్సవర్ణే ఫల ప్రదాన దారిద్ర్య జరే ।
జయజయ ఉమే నమోనమః సేవిత చరణ కమల నఖ
కింజల్కమయే ।
జయజయాన్నపూర్ణే అన్న ప్రదాన నిరతే అన్నార్థీ సంగ్రహపరే
అంధ,బధిర, పంగు పతిత, మహాపాపి,శరణాగత త్రాణనిరతే॥1

ఉద్యద్భాస్కర సన్నిభాం త్రినయనాం మాణిక్య వర్ణాం శివాం ।
పాశం చాంకుశ మిక్షు చాపమనిశం బాణాం ధధానాం కరాం ।
ధ్యాత్వా కల్పలతాం సమస్త ఫలదాం నిత్యాన్నదాన ప్రదాం।
విశ్వస్యాస్య విధాయకస్య జననీం గౌరీం నమో గోత్రజాం॥ 2

సర్వ తీర్థ మయీ గౌరీ సర్వదేవ మయీ శివా ।
సర్వ ధర్మమయీ నిత్యా పూజా కార్యాం విశేషతః ॥ 3

## ప్రదక్షిణ ఫలం

తతోఽపి కోటి గుణిత మన్తర్గేహ ప్రదక్షిణ ।
అన్తర్గేహాత్ బహుగుణం భవానీ క్షేత్ర ప్రదక్షిణా । 4

ప్రదక్షిణీం కృతా యేన మహాపాతక నాశినీం ।
అష్టవారం సుకృతిభిః నతేషాం భ్రమణం క్వచిత్ ॥ 5

అహో భవానీ సదనే నిషిరతాం
ప్రదక్షిణీ కృత్య యదాయదా సుఖం ।
న తత్సుఖం యోగ యాగాది సాధ్యం
అంబాపురః ప్రాణభృతాం దదాతి ॥ (కాశీరహస్యం)

గృహం న కాశీ సదృశం సుఖాయ ।
పితా న విశ్వేశ సమం క్వచిద్భవేత్ ॥
మాతా భవానీ సదృశీ న గర్భహో ।
కుటుంబ మత్రైవ జనో జనార్దనః ॥ (కాశీరహస్యం)

# శ్రీ అన్నపూర్ణాష్టకమ్

(శ్రీశంకరాచార్య)

నిత్యానందకరి వరాభయకరి సౌందర్యరత్నాకరి
నిర్ధూతాఖిల ఘోరపాపనికరి ప్రత్యక్షమాహేశ్వరి
ప్రాలేయాచలవంశ పావనకరి కాశీపురాధీశ్వరి
భిక్షాం దేహి కృపావలంబనకరి మాతాన్నపూర్ణేశ్వరి 1

నానారత్న విచిత్రభూషణకరి హేమాంబరాడంబరి
ముక్తాహార విడంబమాన విలసద్వక్షోజకుంభాంతరి
కాశ్మీరాగరు వాసితాంగరుచిరే కాశీపురాధీశ్వరి
భిక్షాం దేహి కృపావలంబనకరి మాతాన్నపూర్ణేశ్వరి 2

యోగానందకరి రిపుక్షయకరి ధర్మైకనిష్ఠాకరి
చంద్రార్కానల భాసమానలహరి త్రైలోక్యరక్షాకరి
సర్వైశ్వర్యకరి తపఃఫలకరి కాశీపురాధీశ్వరి
భిక్షాం దేహి కృపావలంబనకరి మాతాన్నపూర్ణేశ్వరి 3

కైలాసాచల కందరాలయకరి గౌరీహ్యుమా శాంకరి
కౌమారి నిగమార్థగోచరకరి హ్యోంకారబీజాక్షరి
మోక్షద్వార కవాట పాటనకరి కాశీపురాధీశ్వరి
భిక్షాం దేహి కృపావలంబనకరి మాతాన్నపూర్ణేశ్వరి 4

దృశ్యాదృశ్య విభూతి పాలనకరి బ్రహ్మాండ భాండోదరి
లీలానాటక సూత్రఖేలనకరి విజ్ఞానదీపాంకురి
శ్రీవిశ్వేశ మనః ప్రమోదనకరి కాశీపురాధీశ్వరి
భిక్షాం దేహి కృపావలంబనకరి మాతాన్నపూర్ణేశ్వరి 5

ఆదిక్షాంత సమస్తవర్ణనకరి శంభుప్రియే శాంకరి
కాశ్మీరే త్రిపురేశ్వరి త్రినయని విశ్వేశ్వరి శ్రీకరి
స్వర్గద్వార కవాటపాటనకరి కాశీపురాధీశ్వరి
భిక్షాం దేహి కృపావలంబనకరి మాతాన్నపూర్ణేశ్వరి 6

ఉర్వీసర్వజయేశ్వరి జయకరి మాతా కృపాసాగరి
నారీ నీలసమాన కుంతలధరి నిత్యాన్న దానేశ్వరి
సాక్షాన్మోక్షకరి సదా శుభకరి కాశీపురాధీశ్వరి
భిక్షాం దేహి కృపావలంబనకరి మాతాన్నపూర్ణేశ్వరి 7

దేవీ సర్వ విచిత్రరత్న రచితా దాక్షాయణి సుందరి
వామాస్వాదు పయోధర ప్రియకరి సౌభాగ్యమాహేశ్వరి
భక్తాభీష్టకరి దశాశుభకరి కాశీపురాధీశ్వరి
భిక్షాం దేహి కృపావలంబనకరి మాతాన్నపూర్ణేశ్వరి 8

చంద్రార్కానల కోటికోటి సదృశా చంద్రాంశు బింబాధరి
చంద్రార్కాగ్ని సమాన కుండలధరి చంద్రార్కవర్ణేశ్వరి
మాలాపుస్తక పాశ సాంకుశధరి కాశీపురాధీశ్వరి
భిక్షాం దేహి కృపావలంబనకరి మాతాన్నపూర్ణేశ్వరి 9

క్షత్రత్రాణకరి సదా శివకరి మాతాకృపాసాగరి
సాక్షాన్మోక్షకరి సదా శివకరి విశ్వేశ్వరి శ్రీధరి
దక్షాక్రందకరి నిరామయకరి కాశీపురాధీశ్వరి
భిక్షాం దేహి కృపావలంబనకరి మాతాన్నపూర్ణేశ్వరి 10

అన్నపూర్ణే సదాపూర్ణే శంకరప్రాణవల్లభే
జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాం దేహి చ పార్వతి 11
మాతా చ పార్వతీ దేవీ పితా దేవో మహేశ్వరః
బాంధవాః శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ 12

# శ్రీ దేవీ మంగళాష్టకము

రచన: శ్రీ నిర్వం శంకరశాస్త్రి

శ్రీవిద్యా శివవామభాగనిలయా కామేశ్వరి సుందరి
మాతృమ్మూలదశావిశేషిత జగద్రూపేణ విద్యోతినీ
స్వాంశీభూత సమస్తభూత హృదయాకాశ స్వరూపా శివా
లోకాతీత పదాశ్రయా శివసతీ కుర్యాత్సదా మంగళమ్

దుర్గా భర్గమనోహరా సురవరైః సంసేవ్యమానా సదా
దైత్యానాం సువినాశినీ చ మహతాం సాక్షాత్ఫలాదాయినీ
స్వప్నేదర్శనదాయినీ వరముదం సంధాయినీ శాంకరీ
పాపఘ్నీ శుభకారిణీ సముదితా కుర్యాత్సదా మంగళమ్

బాలా బాలార్కవర్ణాఢ్యా సౌవర్ణాంబరధారిణీ
చండికా లోకకల్యాణీ కుర్యాన్మే మంగళం సదా

కాళికా భీకరాకారా కలిదోష నివారిణీ
కామ్యప్రదాయినీశైవీ కుర్యాన్మే మంగళం సదా

హిమవత్పుత్రికా గౌరీ కైలాసాద్రి విహారిణీ
పార్వతీ శివవామాంగీ కుర్యాన్మే మంగళం సదా

వాణీ వీణాగానలోలా విధిపత్నీ స్మితాననా
జ్ఞానముద్రాంకితకరా కుర్యాన్మే మంగళం సదా

మహాలక్ష్మీః ప్రసన్నాస్యా ధనధాన్య వివర్ధినీ
వైష్ణవీ పద్మజా దేవీ కుర్యాన్మే మంగళం సదా

శంభుప్రియా చంద్రరేఖా సంశోభిత లలాటికా
నానారూప ధరా చైకా కుర్యాన్మే మంగళం సదా

మంగళాష్టక మేతద్ధి పఠతాం శృణ్వతాం సదా
దద్యాద్దేవీ శివం శ్రేయ మాయురారోగ్యభాగ్యకమ్

